## చైనా భారత దేశాల నాయకుల చారిత్రిక సమావేశము

గాంధిమహాత్ముడు మహాదేవ దేశాయిగారితోను, సైపిష్టులోను కలిసి నాగపూరు మెయిలులో ఫిబ్రవరి౧౭వ తేదిఉదయము ౧౦గంటలకు హౌరా స్టేషనుకు వచ్చి అక్కడనుండి రామరాజతలస్టేషనుకు చేరిరి-అక్కడ పండిత నెహ్రూగారు మహాత్మునిదర్శించి చైనామంత్రిమండలిలో శాసనసభ్యుడగు టావో ఫాంచాంగ్ గారిని, భారతదేశమందు చైనా ప్రతినిధియగు డాక్టర్ సీ-జె-షావో గారిని, ప్రొఫెసర్ టానయున్ సేన్ గారిని మహాత్మునికి పరిచయముచేసిరి- మహాత్ముడు బండిఘండిదిగగానే బెంగాలురాష్ట్రీ కాంగ్రెసు సంఘాధ్యక్షుడువారికి పూలహారమువేసెను.టావో ఫాంచాంగుగారి భుజము వానుకొని, పండిత నెహ్రూగారిని వెంటబెట్టుకొని గాంధిగారు ప్లాట్ ఫారందిగివచ్చి "గాంధికిజెయ్"అను నినాదములుమిన్నుముట్టుచుండ కారులోఎక్కి బిర్లా పార్కుకుపోయిరి-చైనాముఖ్యులు ప్రభుత్వభవనముకు పోయిరి.

మధ్యాహ్నము ౧.౨౫ని.లకు మార్షల్ చియాంగ్ కైషేక్ గారు పతితోను తనపరివారములోనిదుగురితోను బిర్లాపార్కుకువచ్చిరి- జవహర్లాలుగారు స్వాగతమిచ్చిరి-బిర్లాకుటుంబములో స్త్రీలు పూలహారములనువేసిరి-తర్వాత అతిథులు బిర్లాభవనములోనికి గొనిపోబడిరి- గాంధిమహాత్ముడువచ్చి వారినికలిసికొనెను- అన్యోన్యవందనముల తర్వాత మహాత్ముడును షేక్ గారును అనువాదకునిసాహాయ్యములో సంభాషణలను ౧౦ నిమిషములుసాగించినతర్వాత నెహ్రూగారు షేక్ దంపతులను ప్రక్కగదిలోనికిగొనిపోయి భారతీయపద్ధతిన ఫలాహారముల నిప్పించిరి. సంభాషణలసమయములో జవహర్లాలు,దేశాయి, టావో ఫాంచాంగుగార్లుకూడ ఉండిరి- ఫలహారానంతరము షేకుగారొకగంటసేపు విశ్రమించిరి- మధ్యాహ్నము ౩గం మొదలు ౕ.గం.౨౦ని.లవరకు మరల నాయకశిఖామణుల సంభాషణలు సాగినవి- సంభాషణలు ముగిసినపిమ్మట షేక్ గారు సెలవుపుచ్చుకొని -జవహర్లాలు, దేశాయిగారలు, బిర్లా కుటుంబమువారు సాగనంపిరి- షేకుగారు ప్రభుత్వభవనానికి బయలుదేరవెంటనే గాంధిగారు రైలుస్టేషనుకుబయలుదేరిరి. బిర్లాపార్కు వెలుపల పెక్కుదేలమంది వీరలనుచూచుటకుసమావేశమై "మహాత్మా గాంధికి జెయ్"అను నినాదములను చేసిరి.

తర్వాత షేక్ పతిగారికిని జవహర్లాలుగారికిని బిర్లాకుటుంబమువారు ఉపాహారములనొసగిరి- తర్వాత జవహర్లాలుగారు షేక్ పతిగారిని విడిదిలోదిగవిడచి తాము తమబసకుపోయిరి.

మధ్యాహ్నము సంభాషణలసమయములో మహాత్ముడు ౨౦నిమిషములు రాటముపైనూలువడికెను- నూలును వారు షేకుగారికి సమర్పించుకొనిరి.

మహాత్ముడు వెలుపలికి రాగానే పత్రికలప్రతినిధులు వారినిఅడిగిరి- వారందుకు "నేనురైలుకు పోవలెను-పత్రికలలో ప్రకటించదగినవిషయములున్నచో జవహర్లాలుగారు తెలుపగలరు"అనిరి. ఆసాయంకాలమే వర్ధాకువెళ్లిపోయిరి, జవహర్లాలుగారిని విలేఖకులడుగగా "ఇండియా, చీనాదేశములకును. ప్రపంచములోని ఇతర దేశములకును సంబంధించిన అన్నివిషయములను గురించియు సంభాషణలుజరిగినవి,"అని జవాబిచ్చిరి- షేకుసతిగారిని విలేఖకులడిగిరి-ఆమెకూడ ఏమియుచెప్పలేదు-బిర్లాకుటుంబములోని ఒక్క స్త్రీకిమాత్రము నోటుబుక్కులో "తల్ప్రపంచమున్నై మనకందరికిని వాక్కున్నది"అని చీనాభాషలో వ్రాసి సంతకముచేసినది-

పెద్దవారిపట్ల చిన్నవారుమర్యాదచూపినపుడు చిన్నవారిపట్ల ప్రతిమర్యాదను పెద్దవారుచూపుట చీనావారిసంప్రదాయమునకు విరుద్ధముగనుక షేకుగారు గాంధిమహాత్మునితో తనను కలిసికొనుటకు తనవిడిదికి రానక్కరలేదని చెప్పిరట.

### షేక్ దంపతుల శాంతినికేతనయాత్ర

షేక్ దంపతులు సపరివారముగ ప్రత్యేకరైలులో ఫిబ్రవరి ౧౯వతేదిన శాంతినికేతనమునకుపోయిరి- అక్కడికివిశ్వభారతిఅధ్యక్షుని కార్యదర్శిలో లా పూరుస్టేషనుకద్దవారలకు స్వాగతమిచ్చితెచ్చెను- రవీంద్రనాథ్ టాగూరుగారు వారలకభివందనముచేసెను- షేక్ దంపతులు రవీంద్రనాథ్ టాగూరుగారు అంత్యకాలములో వసించియుండినదీశలో కొంతతడవుండి,కళాభవనమును వైద్యభవనమును దర్శించిరి-

### సన్మానములు

ఫిబ్రవరి ౧౭వతేదిన శాసనసభలోనిదస్టేట్ కౌన్సిలుసభవారు అసెంబ్లీసభవారలతో షేక్ దంపతులకు స్వాగతము నొసగుటకతీర్మానమునామోదించిరి- బెంగాలుశాసనసభలోనిదగు లెజిస్లేటివ్ కౌన్సిలుకూడ ఆదేశోజాన ఇట్టిస్వాగతప్రతీర్మానమునే ఆమోదించెను- కలకత్తా కార్పొరేషనుసభవారు ౧౯వతేదిన సమావేశమై షేక్ దంపతులు కార్పొరేషను సభకువచ్చుటకువీలున్నయెడలవారలకు సన్మానపత్రము సమర్పించవలెననియు అట్లువీలులేనిచో కొలలపత్రముకనుకార్పొరేషనుపత్రమునను వారలకుస్వాగ

## తాత్కాలికముగ రేవా మహారాజు పదభ్రష్టత

### వారినిగూర్చి విచారణకై వైస్రాయిగారి ఆజ్ఞ

క్రొత్తఢిల్లి, ఫిబ్రవరి౧౭

రేవామహారాజు చాలాదారుణమైన నేరాలలో పాల్గొనుచున్నట్లు తగినంతబలమైనసాక్ష్యముతో కూడినసమాచారము వైస్రాయి గారికి తెలియవచ్చునది-౧౯౪౦ అక్టోబర్ ౨౫ తేదినాడు చేయబడిన ౧౨౭౨ ఆర్-౧౦౦౦౦బరుగల తీర్మానముప్రకారము, ప్రత్యేకవిచారణ సమితిని ఏర్పాటుచేసి, యీనేరములను విచారించుటకు వైస్రాయిగారు నిశ్చయించిరి.

ఈవిషయమును ప్రత్యేకసమితివారివిచారణకు పంపుటకుపూర్వము, రేవాసంస్థానములోనే ఇంకా పరిశోధనచేయవలసియున్నది- రేవామహారాజు నివాసముచేయుచున్నచోయీ పరిశోధన సంతృప్తికరముగా జరుపవీలులేదని వైస్రాయిప్రతినిధినమ్మకము-అందుచేత రేవామహారాజు, సంస్థానమువెలుపల నివాసమునేర్పరచుకొనుటయు, సంస్థానములోఅభించెడి సాక్ష్యము సంపాదించుటలో దోక్యము కలిగించుకొకుండుటయు చాలా ముఖ్యమని వైస్రాయిగారి విశ్వాసము.

ఇట్టిస్వతంత్ర విచారణలు జరుగుటకు తాను ఒప్పుకొననని రేవామహారాజు సూచించినందున, న్యాయస్థాపనకు అవసరమైనవిచారణలను జరిపించుటకుగాను రేవామహారాజు పరిపాలనాధికారములను తాత్కాలికముగ అవసరము తోచినది. సంస్థాన పరిపాలనాధికారాలను తాత్కాలికముగా స్వాధీనపరచుకొనుటకు ఒక రాజకీయాధికారిని వైస్రాయిగారు పంపినారు.

[రేవామహారాజు బాంధవేశ్ మహారాజాధిరాజ సర్ గులాబ్ సింగుబహాదర్, ౧౯౧౮లో తన ౧౫వఏట, రేవాసింహాసనమునధిష్టించెను-నాలుగుసంవత్సరముల తరువాత, పరిపాలనాధికారము ననుస్వీకరించెను-రెండుసార్లు వివాహము చేసుకొనిరి.

సెంట్రల్ ఇండియా ఏజన్సీలోని సంస్థానాలలోకెల్లా, రేవాసంస్థానమే పెద్దది. దీనివైశాల్యము౧౩౦౦౦చదరపుమైళ్ళు-జనాభా౧౫౮౭౪౪౫ప్రకారము ౧,౫౭౨,౪౫౫. సంవత్సరాదాయము ౭౦లక్షల రూపాయలు,)

తమిచ్చుటకపత్రముపైసంతకముచేసిదానిని షేక్ దంపతులకు పంపవలెనను తీర్మానము నామోదించినారు-

### కే.శే. సర్ అక్బర్ హైదరీగారు

సర్ అక్బర్ హైదరిగారి మరణమునకై విషాదమును వెల్లడించుచు,వారికుటుంబమువారికి సానుభూతిని తెలుపుతీర్మానమును భారత శాసనసభలోనొకభాగమగుస్టేట్ కౌన్సిలువారు ఫిబ్రవరి ౧౭వతేదిన ఆమోదించిరి-

## మదరాసుకు ఉపద్రవం

### ప్రభుత్వం హెచ్చరిక, గవర్నరుగారి అభయం

మదరాసు గవర్నరుగారు ఫిబ్రవరి ౧౬వతేదిన మదరాసులో కార్పొరేషనువారేర్పాటుచేసిన పుష్పప్రదర్శనమును ప్రారంభము చేయునపుడు సింగపూరుపతనమును తెలిపి దానికైఖేదపడక, అంతిమవిజయమును నమ్ముకొనియుండవలెనని చెప్పిరి ఈలోగా మదరాసుప్రజలు భయపడనక్కరలేదనియు, సైనికాధికారులును, ఇండియాప్రభుత్వమున్ను, మదరాసుప్రభుత్వమున్ను పరిస్థితిని అదుపులోనుంచినవనియు, మదరాసునగరంనుండి వెళ్లిపోయినవారిలో భయపడిచేరక పట్టణములోనే ఉండి పనులుచేసికొనుచున్నచో ఎప్పుడేమిచేయవలెననది ప్రభుత్వమువారు తెలుపగలరని యు ఉపన్యసించిరి.

అమరునాడే మదరాసుప్రభుత్వప్రవిటల్ డిఫెన్సుశాఖవారిట్లు ప్రకటించిరి-"సింగపూరుపతనంతోమదరాసుపైసముద్రమునుండిదాడిజరిగే ఉపద్రవము ఎక్కువగాకనిపించుచున్నది. ప్రజలునగరమునువదలిపోవలసినంత స్థితిఉన్నదని ప్రభుత్వమువారుతలచుటలేదుగాని,ఏదైనను దాడిజరుగునెడల అందరును ఒక్కసారి గుంపులుగుంపులుగా హడావుడిగా లేచిపోకుండ ఇపుడు నగరములో పనిలేనివారలునుఉపద్రవమెక్కువకాగానే వెళ్లిపోదలచినవారలును సాధ్యమైనంత త్వరలో వెళ్లిపోవలెననిప్రభుత్వమువారుతలచుచున్నారు"

